SIMULTANEOUSLY PUBLISHED FROM VIJAYAWADA AND MADRAS



# ఆంధ్రపత్రిక



Regd H. No 506 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO సంపుటం 56, సంచిక 147

విజయవాడ, బుధవారం 27 - 8 - 1969 THE ANDHRA PATRIKA ఉదయం ** 6 పుటలు 12 పైసలు

# యు. పి. విధానసభలో సభాపతిపై దిండ్లు, పాదరక్షల ప్రయోగం

## ప్రతిపక్ష సభ్యుల అగడం: బలవంతంగా పోలీసులచే సభనుంచి గెంటివేత

లక్నో, ఆగస్టు 26:

ఉత్తరప్రదేశ్ శాసనసభలో నేడు సభాపతి శ్రీ ఎ. జి. ఖేర్‌పై పత్రికలను, దిండ్లను, పాదరక్షలను విసురుతూ, బల్లలను మ్రోగిస్తూ, సభాపతి స్థానంనుంచి లేచిపో అని నినాదాలు చేస్తున్న ప్రతిపక్ష సభ్యులను అదుపులో పెట్టడానికి పోలీసులను పిలిచారు.

శాసనసభ నేడు సమావేశమైనప్పుడు జనసంఘ్ నాయకుడు శ్రీ ఎం. పి. త్రిపాఠీ, కమ్యూనిస్టు నాయకుడు శ్రీ గోవిందసింగ్ బిష్ట్ ప్రతిపక్ష సభ్యులు నిలుపుదల లేచి సభాపతి స్థానాన్ని ఖాళీచేయాలని శ్రీ ఖేర్‌ను అభ్యర్థించారు. ఉపసభాపతి శ్రీ వాసుదేవసింగ్ సభాపతి స్థానంలో వుండి కార్యక్రమాలు నిర్వహించాలని వారు కోరారు. ప్రశ్నోత్తరాల సమయం వచ్చేసరికి తీవ్రమైన గందరగోళం, గొడవ జరిగింది. సభాపతి శ్రీ ఖేర్ తన స్థానంలో కూర్చున్నప్పుడు శాసనసభా సిబ్బంది ఆయనను రక్షణగా చుట్టూ నిల్చున్నారు.

ఎ. జి. ఖేర్ ముర్దాబాద్ అనే నినాదాలు మిన్నుముట్టాయి. సభాపతిని కాపాడడం కోసం సభాసిబ్బంది వేదికలో … పట్టుకొని శ్రీ ఖేర్‌ముట్టా గోడలా నిలబడి వుండగా శ్రీ ఖేర్ తన కుర్చీలో కూర్చుని వుండిపోయారు.

ఆ సమయంలో ఉపసభాపతి శ్రీ వాసుదేవ సభలో ప్రవేశించి బయటకు పోవాలని పోలీసు అధికారిని, పోలీసులకు ఆదేశించారు.

బి. కె. డి. సభ్యుడు శ్రీ డి. పి. బోరాను పోలీసులు చేతులమీదుగా ఎత్తుకొని సభబయటకు తీసుకొనిపోయారు.

శ్రీ బోరా కొద్దినిముషాల తర్వాత లోపలికి తిరిగివచ్చి సభాపతికి వ్యతిరేక నినాదాలు చేయనారంభించారు.

పోలీసులు బలవంతంగా ప్రతిపక్ష సభ్యులను బయటకు తీసుకొని పోనారంభించినంతలో ప్రతిపక్షాలవారు సీటుకున్నను పోలీసులపైనా, అధికారపక్షం సభ్యులపైనా విసిరారు.

ఎస్. ఎస్. పి. నాయకుడు శ్రీ …ర్. నైనా…, ఆయన సహచరులు అద్దునిని

(మిగతా 4 వ పేజీలో)

# ప్రధాని ప్రభుత్వంలు క్షమాపణ చెప్పాలి

## లోక్‌సభలో జనసంఘ్ సభ్యుల పట్టు

న్యూఢిల్లీ, ఆగస్టు 26: కాంగ్రెసు ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి తమ పార్టీ కుట్ర పన్నిందన్న నిరాధారమైన ఆరోపణలు చేసినందుకు ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధి, శ్రీ జగ్జీవన్‌రామ్, శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహ్మద్‌లు క్షమాపణలు చెప్పాలని జనసంఘం సభ్యులు శ్రీయుతులు కె. ఎల్. గుప్తా, బాలరాజ మదోక్‌లు నేడు లోక్‌సభలో పట్టుబట్టారు.

ప్రశ్నోత్తరాల సమయానంతరం శ్రీ కె. ఎల్. గుప్తా ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ ఈ ఆరోపణలు నిరాధారమని కాంగ్రెస్ కార్యవర్గం ప్రకటించిన తరువాత బాహాటంగా క్షమాపణలు చెప్పడం ప్రధాన మంత్రికి విధాయకమని అన్నారు. ఇలాంటి ఆరోపణలు తమ పార్టీని అపఖ్యాతి పాలుచేయడానికేనని ఆయన అన్నారు.

తన అనుమతి లేకుండా సభ్యుడు ఈ విషయాన్ని ప్రస్తావించడానికి సభాపతి శ్రీ ధిల్లాన్ అభ్యంతరం తెలిపారు.

ఈ ఆరోపణలు తనకు ఆశ్చర్యాన్ని కల్గిస్తున్నాయన్నారు. పార్టీలకు సంబంధించిన ప్రశ్నలను సభలో వేయరాదని శ్రీ గుప్తా లోగడ ఇంతకు ముందు కలుసుకున్నప్పుడు స్పష్టం చేశానన్నారు. కాంగ్రెసు సభ్యులు హర్షధ్వానాలు చేశారు.

కొద్ది సేపటి తర్వాత శ్రీ మదోక్ లేచి శ్రీమతి గాంధి క్షమాపణ చెప్పాలన్నారు. కాంగ్రెస్ సభ్యులు కూర్చో కూర్చో అని కేకలు వేశారు.

## 25 మంది యు. పి. ప్రతిపక్ష సభ్యుల సస్పెన్షన్

లక్నో, ఆగస్టు 26: ఉత్తరప్రదేశ్ విధానసభలో నేడు 'అమర్యాదగా ప్రవర్తించినందుకు' 25 మంది ప్రతిపక్ష సభ్యులను ఓ రోజులపాటు సస్పెండ్ చేశారు.

వీరిని సస్పెండ్ చేయాలని కోరుతూ అర్థిక మంత్రి శ్రీ లక్ష్మీరమణ్ ఆచార్య ప్రతిపాదించిన తీర్మానాన్ని సభవారు ఆమోదించారు.

సస్పెండ్ చేయబడిన 25 మంది సభ్యులలోను ప్రధాన ప్రతిపక్షమైన బి. కె. డి. కి చెందిన వారు 14 మంది, ఎస్. ఎస్. పి. సభ్యులు 8 మంది. మిగిలిన ముగ్గురు స్వతంత్ర పార్టీకు చెందిన ఒక్కొక్కరు.

(మిగతా 3 వ పేజీలో)

# రు 200 లోపు పింఛనుదారులకు తాత్కాలికంగా రు 10 పెంపు

## సెప్టెంబరు ఒకటినుంచి అమలు: రాజ్యసభలో ప్రధాని ఇందిరాగాంధి ప్రకటన: అన్ని పక్షాలవారి హర్షం

న్యూఢిల్లీ, ఆగస్టు 26—

నెలకు 200 రూపాయల వరకు పింఛను పుచ్చే వారందరికీ తాత్కాలిక సహాయంగా 10 రూపాయలను పెంచుతున్నట్లు ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి నేడు ప్రకటించారు. ఈ పెంపుదల సెప్టెంబరు ఒకటవ తేదీ నుంచి అమలులోకి వస్తుంది.

రాజ్యసభలో శ్రీ రామ్‌సహాయ్ వేసిన అడిగిన ప్రశ్నకు జవాబిస్తూ ప్రధాని పై ప్రకటన చేసినప్పుడు అన్నిపక్షాల సభ్యులు పెద్ద పెట్టున హర్షధ్వానాలు చేశారు.

నెలకు 200 రూపాయలవరకు పింఛను పొందుతున్నవారి విషయంలో తాత్కాలికంగా పదిరూపాయల పింఛను పెంచుతున్నట్లు ప్రకటించడానికి తానెంతో సంతోషిస్తున్నానని శ్రీమతిగాంధి అన్నారు.

నెలకు 200 రూపాయలకు పైబడి కొద్ది మొత్తాన్ని పొందుతున్నవారి విషయంలో అవసరమైన నామమాత్రపు సర్దుబాట్లు చేయగలదని ఆమె చెప్పారు.

ప్రధానమంత్రి నేడు సభలోనికి ప్రవేశించినప్పుడు అందరూ హర్షధ్వానాలు చేశారు. ప్రధానమంత్రి నిర్వహిస్తున్న ఆర్థికశాఖకు సంబంధించి సభ్యులు పెక్కు ప్రశ్నలు అడిగారు. చాలావాటికి సహాయమంత్రి శ్రీ పి. సి. సేఠీ సమాధానమిచ్చారు.

పింఛను పెంపుదలపట్ల శ్రీ పీతాంబర్ దాస్ హర్షం ప్రకటిస్తూ, పింఛను పొందడంలో పింఛనుదారులు చాలా ఇబ్బందులు పడుతున్నారని, ఈ పింఛనులు అందడానికి చాలాకాలం పడుతోందని, అందుచేత చెల్లింపులు త్వరితగతిని జరిగేటట్లు చూడాలని కోరారు.

ప్రధానమంత్రి ఈ అభిప్రాయంతో అంగీకరిస్తూ, చెల్లింపులు త్వరితగతిని జరగవలసి వున్నదన్నారు.

## శ్రీ నిజలింగప్ప అస్వస్థత

### ప్రధాని పరామర్శ

న్యూఢిల్లీ, ఆగస్టు 26: కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ నిజలింగప్ప నేటి ఉదయం నుంచి అస్వస్థులుగా వున్నారు. డాక్టర్లు ఆయనను పరీక్షించి, ఆయన ఆరోగ్యం గురించి ఆందోళన చెందవలసినదేమీ లేదని, పని భారంవల్ల బలహీనంగా వున్నారని చెప్పారు. పూర్తి విశ్రాంతి తీసుకోవాలని సలహా ఇచ్చారు.

రక్తపు పోటు తక్కువగా వున్నందున శ్రీ నిజలింగప్ప అస్వస్థతకు లోనయ్యారు.

నేడు శ్రీ నిజలింగప్పను పరామర్శించడానికి వచ్చిన వారిలో శ్రీయుతులు సంజీవ రెడ్డి, పెండేకంటి వెంకటసుబ్బయ్య, (ఎ. ఐ. సి. సి. కార్యదర్శి) మహారాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ వి. పి. నాయక్, గుజరాత్ ముఖ్యమంత్రి శ్రీ హితేంద్రదేశాయ్ వున్నారు.

ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి నేటిసాయంకాలం కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ నిజలింగప్పను కలుసుకున్నారు. ప్రధాని పార్లమెంటు భవనం నుంచి నరాసరిని శ్రీ నిజలింగప్ప గృహానికి వెళ్లారు. ఈ సమావేశం ముందుగా అనుకోకుండా జరిగింది.

శ్రీమతి గాంధివచ్చిన సమయంలో శ్రీ నిజలింగప్ప విశ్రాంతి తీసుకొంటున్నారు. ఆయన

(మిగతా 3 వ పేజీలో)

# ప్రభుత్వ సంస్థలకు హెచ్చు అధికారాలు

## ప్రధాని ప్రకటన: సచివాలయం అధికారాలనుంచి విముక్తికి ఆలోచన

న్యూఢిల్లీ, ఆగస్టు 26:

ప్రభుత్వరంగంలోని పరిశ్రమలతో సచివాలయానికి గల సంబంధాలను క్రమంగా తొలగించడానికి తాము ప్రయత్నించగలమని ఆర్థికశాఖ సలహాసంఘ సమావేశంలో ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధి చెప్పినట్లు తెలుస్తోంది.

ఈ సంఘం తొలి సమావేశానికి ప్రధాని అధ్యక్షత వహిస్తూ, ప్రభుత్వ రంగంలోని సంస్థలకు హెచ్చు అధికారాలు ఇవ్వడానికి సంబంధించిన వివిధ పద్ధతులను వివరించినట్లు తెలుస్తున్నది.

ప్రభుత్వం ఆమోదించిన పరిపాలనా సంస్కరణల సంఘం సూచించిన పంథాలో చర్యలను తీసుకోవాలని మంత్రులకు, ప్రభుత్వసంస్థలకు ఆదేశాలు ఇచ్చినట్లు కూడా ప్రధాని వెల్లడించినట్లు తెలుస్తోంది.

మిగులు సిబ్బందిని వీలైనంత మేరకు తగ్గించడానికి స్వచ్ఛంద పదవీ విరమణ పథకాలను ప్రభుత్వ సంస్థలు రూపొందించాలని ఆమె తెలిపారు. (యు. ఎన్. ఐ)



## సెలవు

27-8-69 బుధవారం శ్రావణ పూర్ణిమ సందర్భంగా మా కార్యాలయములకు సెలవు. 28 వ తేదీగల పత్రిక వెలువడదు.

మేనేజరు,
ఆంధ్రపత్రిక.

## గంటల పంచాంగం

శ్రీ సౌమ్యనామ సం. శ్రావణ శు. పూర్ణిమ 1969 సం. ఆగస్టు 27 బుధవారం బుధ: పూర్ణిమ: సా. 4.2, ధనిష్ఠ: ఉ. 9.34, వర్జ్యం: సా. 4.17 మొదలు 5.45 వరకు.

1969 సం. ఆగస్టు 28 గురువారం గురు: బ. పాడ్యమి: ఉ. 1.15, శత భిషం: ఉ. 7.37, వర్జ్యం: ఉ. 1.34 మొదలు 3.3 వరకు.

ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తన మనంబునకగు దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మ పథముల కెల్లన్
(మహాభారతము)

శ్రీ సౌమ్యనామ సం. శ్రావణ శు. పూర్ణిమ
బుధవారం

## కాంగ్రెస్ కార్యవర్గం తీర్మానం

:o:

ఇటీవల కాంగ్రెస్‌లో సంభవించిన తగాదాలను సర్దుబాటు చేసుకుంటూ కాంగ్రెస్ కార్యవర్గం ఒక తీర్మానం చేసింది. అంతటితో, ఇప్పుడు వచ్చిన తగాదాలన్నీ తీరి పార్టీ ఇక ముందు ఏకమత్యంతో కృషి చేస్తూ పని చేస్తుందని గూడా కాంగ్రెస్ నాయకులేమి, కాంగ్రెస్ వాదులు కూడా ప్రకటనలు చేస్తున్నారు. కాని ప్రజలలో మాత్రం ఈ హఠాత్ పరిణామం కాంగ్రెస్ వారిలో ఎట్లా వచ్చేసిందా అన్న ఒక దిగ్భ్రాంతి నిలిచిపోతున్నది. నిన్నటిదాకా "త్వం అంటే త్వం" అనుకున్న కాంగ్రెస్ లోని రెండు వర్గాలు ఇప్పుడు ఒక క్షణంలో భాయీ, భాయీ అనుకోగలుగుతున్నాయంటే ఆ వర్గాలలో ఏ వర్గాన్నిగాని, లేక మొత్తం కాంగ్రెస్‌నుగాని నమ్మడానికి సాధ్యం ఎట్లా అవుతుందని జనం అనుకోవడంలో ఆశ్చర్యం లేదు.

ఇటీవల కాంగ్రెసులో నడిచిన వివాదం, ఆ కాంగ్రెస్‌లో అత్యున్నత స్థానాలలో ఉన్న వారు క్రమశిక్షణను భంగపరచిన పద్ధతి కాంగ్రెసు పార్టీకి ఏ విధమైన ప్రతిష్ఠనుగాని దేశంలో తెచ్చిపెట్టలేదు. ఆ తీర్మానంతో పెట్టుకున్న అతుకు ఆ ప్రతిష్ఠను ఇనుమడింపచెయ్యడం లేదు.

అందువల్ల ఈ చేసిన ప్రధాన తీర్మానాన్నే గాక, ఆ ప్రధాన తీర్మానానికి ముందు ఆమోదింపబడిన ఇంకో తీర్మానాన్ని గూడా కొంత పరిశీలించవలసి ఉంది. మొదటి తీర్మానంలో కార్యవర్గం కాంగ్రెసు అధ్యక్షునిపై శ్రీ ఫక్రుద్దీన్‌అలీ అహమ్మద్, శ్రీ జగ జ్జీవన్‌రాములు చేసిఉన్న అభియోగాలను తిరస్కరించింది. రెండో తీర్మానంలో రాష్ట్రపతి ఎన్నికల సందర్భంలో కాంగ్రెసువోటర్లు కొంతమంది కాంగ్రెసు అభ్యర్థిని బలపరచక పోవడం విషయం ప్రస్తావింపబడి, అది బాధాకరము, దురదృష్టకరము అయిన విషయం అని చెప్పబడివుంది. ఇప్పుడు ఆ రకంగా చేసిన వారిని గట్టిగా అభిశంసించడం జరక్కపోయినా, విమర్శించడం జరిగింది. అంతే గాక కాంగ్రెసులో క్రమశిక్షణ, సంఘటితభావం అవసరం అన్న విషయం స్పష్టీకరింపబడింది. ఇప్పుడు ఆ మొదటి తీర్మానాన్ని, రెండవది అయిన ఈ ప్రధాన తీర్మానాన్ని కలిపి జాగ్రత్తగా అధ్యయనం చేసినప్పుడు, ఇచ్చట ఈ వివాదంలో ప్రధాన మంత్రి వర్గం ఏదో పెద్ద విజయాన్ని సాధించిందని గొప్పగా చెప్పబడుతున్న మాట వట్టి చేవ లేనిదే అని తెలిసిపోవడమే గాక, ఈ తీర్మానంలో పార్టీ క్రమశిక్షణ భంగించే వారు ముందు ముందు కొంత జాగ్రత్తగా ఉండటం అవసరమని ఈ కార్యవర్గం హెచ్చరించిందని విదితం అవుతున్నది.

ఈ వివాదంలో ఎవరైనా విజయాన్ని సాధిస్తే, వారు కార్యవర్గంలో సభ్యులుగా ఉన్న కొంతమంది ముఖ్యమంత్రులు, దేశీయాంగ మంత్రి శ్రీ చవాన్ అని చెప్పవలసి ఉంటుంది. ఎందుచేతనంటే ఉభయవర్గాలకు యోగ్యంగా ఉండే రాజీ సూత్రాన్ని శ్రీచవాన్ తయారు చేశారు. ఆ తీర్మానానికి కార్యవర్గంలో సభ్యులుగా ఉన్న ముఖ్యమంత్రులు శ్రీ చవాన్ పద్ధతికి అనుకూల్యాన్ని ప్రకటించారు. శ్రీమతి గాంధీ ప్రధానమంత్రి కావడానికి పూర్వంగూడా ముఖ్యమంత్రులే నిలబడి తమ మాటను అప్పుడు నెగ్గించుకున్నారు. ఇప్పుడు కార్యవర్గంలో ఈ తీర్మానం గూడా అందులో సభ్యులుగా ఉన్న కొందరు ముఖ్యమంత్రుల వైఖరితో నేస్థైనలా అయిపోయింది. ఒకవిధంగాచూస్తే ఈతీర్మానం ఈ ముఖ్యమంత్రులను సంరక్షించడంకోసమే పుట్టిందా అని పిస్తుంది. కేంద్ర నాయకత్వంలో పటిష్టత లేక, ముఖ్యమంత్రుల అండమీద నిలబడదామనే పద్ధతి పెట్టుకున్నప్పుడు సర్వం ఇట్లా తలక్రిందులుగానే సిద్ధం అవుతుంది.

ఇప్పుడు కాంగ్రెస్ కార్యవర్గం ఇట్లా తీర్మానం చేసినా, కాంగ్రెస్‌లో చెడిపోయిన సమైక్యతను, దెబ్బతిన్న క్రమశిక్షణను పునరుద్ధరించడం ఇప్పటి ఈ నాయకత్వంవల్ల సాధ్యం అవుతుందా అన్న ప్రశ్న అక్కడ ఉదయించి కన్పిస్తున్నది. నాయకత్వం స్థానంలో ఉన్నవారు బహిరంగంగా ఘోర వివాదాలు లేవుకొని, ఆ వివాదాలకు అతి వ్యాప్త దోషం పట్టేంతవరకు సాగదీసి ఇప్పుడు వానిని ఒక్క అడుగున, ఒక తీర్మానంతో నిగ్రహింపగలరా? ఆ నిగ్రహింపగల శక్తి ఈ నాయకత్వంలో ఉన్నదా? అన్న ప్రశ్నలకు ముందు ముందు గాని సమాధానాలు లభించవు. ఆ సమాధానాలు లభించడం సంగతి ఎట్లా ఉన్నా ఈ నాయకత్వ వివాదాల మూలంగా దేశంలో ప్రజలలో కాంగ్రెస్ అంటే ఏర్పడిపోయిన మలిన భావాన్ని తొలగించుకోవడం ఎట్లాగో కాంగ్రెస్‌వారు ప్రథమంగా ఆలోచించుకోవలసి ఉంది.

కాంగ్రెస్ కార్యవర్గం ఇప్పుడు సంఘటిత భావాలను గురించి మాట్లాడటం గూడా హాస్యాస్పదంగా కన్పిస్తున్నది. గత జనవరిలో ఎన్నికలలో నేమి, ఆ తర్వాత జరిగిన ఉప ఎన్నికలు కొన్నింటిలో నేమి కాంగ్రెసు అభ్యర్థులకు కాంగ్రెసు వారే పోటీ అభ్యర్థులను పోటీపెట్టి ఓడించిన సందర్భాలు, ఓడించాలని ప్రయత్నం చేసిన సందర్భాలు అనేకం ఉన్నాయన్నది బహిరంగ రహస్యం. అసలు రాష్ట్రపతి ఎన్నిక సందర్భంలో ప్రదర్శితమైన క్రమశిక్షణా రాహిత్యం కాంగ్రెసులో చాలా కాలంగా కొనసాగుతూనే వస్తున్నది. ఇప్పుడు రాష్ట్రపతి ఎన్నిక సందర్భంగా క్రమశిక్షణకు వాటిల్లిన భంగపాటును గురించి బహిరంగంగానే ఏమి చేయరాదని కార్యవర్గం నిశ్చయించుకున్నది. ఈ పద్ధతితో కాంగ్రెసు క్రమశిక్షణఎట్లా నిలుస్తుందో గూడా కాంగ్రెసు పార్టీ అంతా ఆలోచించుకోవలసిఉంది.

# అయుదవ ఆర్థిక సంఘం సిఫార్సులు

## కేంద్ర ప్రభుత్వం ఆమోదం: పార్లమెంటులో ఆర్థికశాఖ సహాయమంత్రి సేథీ వెల్లడి

న్యూఢిల్లీ, ఆగస్టు 26: పన్నులు, సుంకాలు, గ్రాంటుల మొత్తాలలో రాష్ట్రాలకు వాటాల పంపిణీ విషయమై అయిదవ ఆర్థికసంఘం లేటెస్టు నివేదికలో సూచించిన సిఫార్సులను కేంద్రప్రభుత్వం ఆమోదించింది.

ఈ సిఫార్సులవల్ల కొన్ని రాష్ట్రాలకు అధికంగా మిగులు నిధులు లభిస్తాయి.

ఆర్థిక సంఘం నివేదిక, దానిపై ప్రభుత్వం నిర్ణయాన్ని ఆర్థికశాఖ సహాయమంత్రి శ్రీ పి.సి. సేథీ నేడు పార్లమెంటుముందుపుంచారు. ఈ మిగులు నిధుల వినియోగం సమస్యపై ప్రణాళికా సంఘం, ఆ యా రాష్ట్రాలతో ప్రభుత్వం చర్చించాలని తలపెట్టిందని మంత్రి పార్లమెంటులో తెలియజేశారు.

అదనపు ఎక్సయిజు సుంకాల విషయంలో రాష్ట్రప్రభుత్వాలతో చర్చించి, తగిన సవరణలతో ప్రస్తుత ఏర్పాట్లు కొనసాగింపునకు కేంద్రప్రభుత్వం ఒప్పందం కుదుర్చుకుంటేనే గాని, ప్రస్తుత ఏర్పాట్లు కొనసాగించడం వాంఛనీయం కాదని ఆర్థిక సంఘం చేసిన సిఫార్సును ప్రభుత్వం గుర్తించింది.

ఈ విషయాన్ని జాతీయాభివృద్ధి మండలి ముందు వుంచుతున్నట్లు శ్రీ సేథీ పార్లమెంటుకు తెలియజేశారు.

ప్రకటనలపన్ను, దానివేట్ల వ్యవస్థలో మిగిలిపోయింపు సమస్యను ప్రభుత్వం పరిశీలించాలని ఆర్థిక సంఘం చేసిన సిఫార్సు పరిశీలించబడగలదని ఆయన తెలిపారు.

ఈ పన్ను విషయంలో ఆదాయం పెంపుదలకు అవకాశాలు కలవని, అయితే రాజ్యాంగంలోని 269 అధికరణంలో సూచించిన ఇతర పన్నుల విషయంలో ప్రస్తుత పరిస్థితులలో వీటిని సాధించే అవకాశాలు ఏమీలేవని ఆర్థిక సంఘం అభిప్రాయపడింది.

వివిధ రాష్ట్రాలలో వనరుల సమీకరణకు జరుగుతున్న కృషిపై కూడా ఈ సంఘం కొన్ని వ్యాఖ్యానాలు చేసింది. రాష్ట్రాల ఆదాయం పెంపుదల అవకాశాలపై కొన్ని సూచనలు కూడా చేసింది.

రాష్ట్రప్రభుత్వాలతో సంప్రదించి ఈ విషయం కూడా పరిశీలించడం జరుగుతుందని, నేడు పార్లమెంటుకు తెలియజేయడం జరిగింది.

:o:

## మొరార్జీకి ప్రధాని పదవి

### శ్రీమతిగాంధికి రాజాజీ సలహా

మద్రాసు, ఆగస్టు 26: శ్రీ మొరార్జీ దేశాయిని ప్రధానిగా పనిచేయుమని కోరి, తాము రాష్ట్రపతిగా పనిచేయడానికి సంసిద్ధత తెల్పవలసిందని శ్రీమతి ఇందిరాగాంధికి సలహా యిస్తూ, స్వతంత్రపార్టీ నాయకుడు శ్రీ రాజగోపాలాచారి ఒక "స్నేహపూర్వక లేఖ" వ్రాశారు.

స్వరాజ్య పత్రిక తాజా సంచికలో ఆయన ఈ విషయం వ్రాశారు. రాష్ట్రపతిగా పని చేయడానికి ఆమె సంసిద్ధత తెల్పినట్లయితే, దానికి అమితమైన హర్షామోదాలు వ్యక్తం కాగలవని, ఆ పదవి ప్రతిష్ఠ కాపాడబడగలదని తాము వ్రాసినట్లు ఆయన తెలియజేశారు. కాంగ్రెస్ పార్టీని, దేశాన్ని సేవించడానికిది అత్యుత్తమ మార్గమని తాము ఆమెకు తెలియజేశామన్నారు.

బెంగుళూరులో ఆమెకు తమ లేఖ అందకపోయి వుండవచ్చుననీ, తమ లేఖకు ఆమె వద్ద ఎలాంటి జవాబు రాకపోవడాన్నిబట్టి తమ సలహా ఆమెకు నచ్చలేదని తాము భావించామని ఆయన తెలిపారు. (యు. ఎన్. ఐ)

## యు. పి. అసెంబ్లీలో గంద్రగోళం

(1 వ పేజీ తరువాయి)

పోలీసులు చేతులమీద సభబయటకు మోసుకొనిపోయారు.

శాసన సభ నేడు సమావేశమైనప్పుడు ఎస్. ఎస్. పి. సభ్యుడు శ్రీ మంజూర్ అహ్మద్ నిన్నటి సంఘటనలను వివరిస్తూ సభాపతి తన స్థానాన్ని ఖాళీ చేయాలని, ఉప సభాపతి సభా కార్యక్రమాలను నిర్వహించాలని కోరారు. జైళ్ళ పద్దుపై వోటింగ్ కావాలన్న ప్రతిపక్షాల ప్రజాస్వామ్య హక్కులను సభాపతి త్రోసిపుచ్చారని ఆయన అన్నారు.

ప్రభుత్వం నిన్న పతనమైనందువల్ల నేను శాసన సభలో అధికార పక్షానికి కూర్చునే అర్హత వున్నదా అని శ్రీ గోవింద సింగ్ బిష్టా అడిగారు.

## గవర్నర్‌కు ప్రతిపక్షాలవిజ్ఞప్తి

రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం పతనమైనదని, అందుచేత వెంటనే కొత్త ప్రభుత్వన్నయినా ఏర్పాటు చేయాలని లేదా రాజ్యాంగ రీత్యా ఇతర చర్యలు తీసుకోవాలని యు. పి. విధాన సభలోని ప్రతిపక్ష నాయకులు రాష్ట్ర గవర్నర్ శ్రీ బి. గోపాలరెడ్డికి ఒక సంయుక్త ప్రకటనలో విజ్ఞప్తి చేశారు.

సభాపతి వెంటనే రాజీనామా చేయాలని వారు కోరారు.

ఇది జరగకపోతే అవిశ్వాస తీర్మానాన్ని ప్రతిపాదించగలమన్నారు.

## రాజ్యసభలో ప్రస్తావన

న్యూఢిల్లీ, ఆగస్టు 26: యు. పి. విధాన సభలో నేడు జరిగిన సంఘటనలను గురించి రాజ్యసభలో ప్రస్తావనకు వచ్చింది. దేశీయాంగ మంత్రి ఈ లోనే ఒక ప్రకటన చేయాలని శ్రీ రాజనారాయణ్ ఎస్. ఎస్. పి. కోరారు. 200 నుంచి 300 మందివరకు పోలీసులు యు. పి. శాసన సభలో ప్రవేశించి ప్రతిపక్ష సభ్యులను బలవంతంగా బయటకు తీసుకొనిపోయినట్లు యు. పి. మాజీ మంత్రి శ్రీ ప్రభు నారాయణ్ తనకు ఫోనులో చెప్పారని ఆయన అన్నారు.

తనకు అందిన సమాచారం ప్రకారం సభలో ఒక్క ప్రతిపక్ష సభ్యుడయినా లేనం



శ్రీ ఎస్. ఎస్. వాసన్

# ప్రముఖ చలన చిత్ర నిర్మాత శ్రీ ఎస్. ఎస్. వాసన్ మృతి

మద్రాసు, ఆగస్టు 26: శ్రీ ఎస్. ఎస్. వాసన్ నేటి ఉదయం తను అరపయ్యారోఏట యిక్కడ స్వగృహంలో మృతి చెందారు.

ఆయన రాజ్యసభలో కాంగ్రెసు సభ్యులు. ప్రఖ్యాత తమిళ వార పత్రిక ఆనంద వికటన్ సంపాదకులు, చలన చిత్ర పరిశ్రామికవేత్త.

కొంత అస్వస్థత తర్వాత ఆయన నేటి ఉదయం కన్నుమూశారు. అస్వస్థత కారణంగానే ఆయన ఇటీవల రాష్ట్రపతి ఎన్నికలో తమ వోటును వేయలేకపోయారు.

ఆయనకు సతీమణి, ఒక కుమారుడు, ఒక కుమార్తె వున్నారు.

1903 తిరుత్తురైపూండి గ్రామంలో ఆయన జన్మించారు. (తంజావూరు జిల్లా) వర్తకరంగంలో పిన్ననాటనే ప్రవేశించి 1928 లోనే ఆనంద వికటన్‌ను ఆయన ప్రారంభించారు.

1939 లో ఆయన ఫిలిం పరిశ్రమను చేపట్టారు. జెమినీ స్టూడియోను 1941లో స్థాపించారు. ఆయనను ఫిలిం పరిశ్రమలో జెమినీ వాసన్ అనే అంటారు.

ఆ. ఐ. ఎన్. ఎస్. లో సభ్యుడైన శ్రీవాసన్ దక్షిణ భారత ఫిలిం ఛాంబర్‌కు, అఖిల భారత ఫిలిం ఫెడరేషన్‌కు కూడా అధ్యక్షుడుగా పని చేశారు. కేంద్ర ఫిలిం సెన్సారు బోర్డులో సభ్యులు.

ఫిలిం పరిశ్రమలో ఆయన ప్రత్యేక స్థానాన్ని నిర్మాతగా, దర్శకునిగా చూరగొన్నారు.

## టి. టి. కె. సంతాపం

శ్రీ టి. టి. కృష్ణమాచారి శ్రీ వాసన్ మృతికి సంతాపం తెలుపుతూ 1934 నుంచి ఆయన కాంగ్రెసులో వున్నారు. మార్పులు చేర్పులు లేకుండా ఆయన సంస్థను అట్టే పెట్టుకుని వున్నారు. నేడు అట్టి వ్యక్తులు చాలా లోటు తీరనిది అన్నారు.

## రాజాజీ సంతాపం

మద్రాసులో ఒక ప్రముఖుని మృత్యువు తీసుకునిపోయింది. ఇది అందరికీ విచారకరమైన సంగతి. జీవితంలో సాహస ప్రవృత్తి విజయపరంపర కలిగిన శ్రీ వాసన్ అట్టి వారికి ఆదర్శపురుషుడు అని రాజాజీ సంతాపం ప్రకటించారు.

# ఢిల్లీలో హోటళ్ళలో విలాసవతుల ఉనికి

## లోక్ సభలో ప్రశ్నల పరంపర

న్యూఢిల్లీ, ఆగస్టు 26: ఢిల్లీ హోటళ్ళలో "విలాసవతుల ఉనికి" వార్తలు నేడు లోక్ సభలో ఎన్నో ప్రశ్నలకు కారణమైనాయి.

ఈ కార్యకలాపాలలో కొందరు "పెద్దలకు" సంబంధం వున్నదని ప్రొఫెసర్ బలరాజ్ మధోక్ చేసిన వ్యాఖ్యను కాంగ్రెస్ సభ్యులు ముఖ్యంగా శ్రీ రణధీర్‌సింగ్ నిరసన తెలిపారు.

"కుర్రతనం" ప్రశ్నలకు సభాపతి అనుమతిస్తున్నారని శ్రీ రణధీర్‌సింగ్ అనగా, సభాపతి శ్రీ ధిల్లాన్ ఆయనను మందలించారు. ఇది "కుర్రతనంప్రశ్నకాదు. ఢిల్లీలోని సాంఘిక జీవితంతో దీనికి సంబంధం వున్నది" అని శ్రీ ధిల్లాన్ అన్నారు.

న్యాయశాఖామంత్రి శ్రీ గోవిందమీనన్ మాట్లాడుతూ, రాజధానినగరంలోని హోటళ్ళలో విలాసవతుల ఉనికిని గురించి ప్రభుత్వానికి అధికారయుతమైన సమాచారమేదీ అందలేదని చెప్పారు. అవినీతికర కార్యకలాపాల చట్టంక్రింద నేరాలను అదుపు చేయడానికి ఢిల్లీ పాలకవర్గం అప్రమత్తంగా ప్రయత్నాలు చేస్తున్నదని ఆయన అన్నారు. ఈ విలాసవతుల కార్యకలాపాలలో "పెద్దల"కు జోక్యం దానే అధికార పక్షంవారు కార్యకలాపాలను నిర్వహిస్తున్నారని ఆయన అన్నారు.

భోజన విరామ సమయంలో నిజానిజాలను తెలుసుకొని సభవారికి చెప్పవలసిందిగా దేశీయాంగ మంత్రిని ఆదేశించాలని శ్రీ రాజనారాయణ సభాపతికి విజ్ఞప్తి చేశారు.

శ్రీ ఉమానాథ్ ఒక ప్రశ్నవేస్తూ, కొన్ని పెద్దహోటళ్ళలో గదులలో ఉండేవారికి అవసరం ఐనప్పుడు యువతులను వినియోగించడం జరుగుతున్నదని, దీనిని అవాంఛనీయమైన పరిణామాలు సంభవిస్తున్నవి అన్నారు.

శ్రీ మీనన్ జవాబిస్తూ, ఈ విషయాలను గురించి తమవద్ద సమాచారమేదీ లేదని, సభ్యుడు చెప్పిన సమాచారాన్ని ఆమోదించి దానిపై పరిశీలన జరుపుతామని అన్నారు.

శ్రీ కె. ఎల్. గుప్త ఒక ప్రశ్నవేస్తూ, వెంట స్త్రీలు లేకపోతే లోపలకురానివ్వని రెస్టారెంట్‌లు కొన్ని వున్నవని అన్నారు. కొన్నిచోట్ల నగ్న చలనచిత్రాలు ప్రదర్శించడం మద్యం సరఫరా చేయడం జరుగుతున్నదని ఆయన చెప్పారు.

ఈ విషయాలను గురించి తమవద్ద సమాచారమేదీ లేదని న్యాయశాఖామంత్రి అన్నారు.

ఢిల్లీ హోటళ్ళలో విలాసవతులను గురించి శ్రీ మధోక్ ప్రస్తావించినప్పుడు "గౌరవ సభ్యునికిస్వంత అనుభవ మేమైనా వున్నదా?" అని శ్రీ విశ్వనాథరాయ్ ప్రశ్నించారు.

శ్రీ మధోక్: మీలో పెద్దలు కొందరికి ఈ ముఠాలో జోక్యం వున్నదని నాకు తెలుసు.

శ్రీ మధోక్ ఈ విలాసవతులబారిన ఎప్పుడైనా పడ్డారా అని శ్రీ వి. కృష్ణమూర్తి (డి. ఎం. కె) ప్రశ్నించగా సభ్యులు గొల్లుమన్నారు.

సభ పతి: స్వంత అనుభవంవున్నవా రెవరూ సభలో అది చెప్పరేరు. నవ్వులు

శ్రీ ఉమానాథ్ ఒక ప్రశ్నవేస్తూ, ఈ పెద్ద హోటళ్ల గదుల్లో దిగిన "బడా వ్యాపారులు" తమకు భోజనం అందజేయడానికి వచ్చిన యువతులు కూడా "ఆహారంలో భాగమే ననుకుని" వారిపై చేతులు వేస్తున్నారని అన్నారు. ఇలా యువతులను నియమించకుండా ఏమిచర్య గైకొంటున్నారని ఆయన ప్రశ్నించారు.

## సోమవారంనాటి సంఘటన వివరాలు

జైళ్ళ పద్దుపై వోటింగ్ పెట్టాలని ప్రతిపక్షాలు పట్టుబట్టిన ఫలితంగా తీవ్ర గందరగోళ సన్నివేశం మధ్య సభాపతి శ్రీ కేర్ నిన్న శాసన సభను ఆకస్మికంగా వాయిదా వేశారు.

ఈ పద్దులను చర్చ లేకుండా ఆమోదించవచ్చునని కార్యక్రమ సలహా సంఘం నిర్ణయించినదని, అందుచేత ఓటింగ్ సమస్య లేనేలేదని సభాపతి అన్నప్పుడు ప్రతిపక్ష సభ్యులు అభ్యంతరం తెలిపారు. ఓటింగ్ జరపాలని కోరుతూ కేకలు వేశారు, బల్లలు ప్రయోగించారు.

సభాపతి మొదట పది నిముషాల సేపు సభను వాయిదా వేశారు. కాని వెంటనే ఉప సభాపతి శ్రీ వాసుదేవసింగ్ సభాపతి స్థానంలో కూర్చుని ఈ దశలో ఓటింగ్ కోర్కెను తిరస్కరించ వీలులేదని ఇది ప్రజాస్వామ్యానికి సభ సంప్రదాయాలకు విరుద్ధమని తీర్పు ఇచ్చారు. ఉప సభాపతి ఇంకేదో చెప్పబోతుండగా సభాపతి తిరిగి వచ్చి తన స్థానంలో కూర్చున్నారు. తిరిగి గందరగోళం జరిగింది. ప్రతిపక్ష సభ్యులకు, కాంగ్రెస్ సభ్యులకు మధ్య కొద్దిగా త్రోపులాట కూడా సంభవించింది. ఆ స్థితిలో సభాపతి సభను వాయిదా వేశారు.

## విశాఖలో రాడార్ ఏర్పాటు

న్యూఢిల్లీ, ఆగస్టు 26: విశాఖపట్నంలో తుఫాన్ హెచ్చరికచేసే రాడార్‌ను 1969-70 ఆఖరునాటికి నెలకొల్పగలరని భావిస్తున్నారని నీటిపారుదల, విద్యుత్ ఉపమంత్రి శ్రీ సిద్ధేశ్వర ప్రసాద్ రాజ్యసభలో చెప్పారు.

రాడార్‌ను జపాన్‌నుంచి దిగుమతి చేసుకున్నారు. రూపాయివిలువ తగ్గింపుకు ముందు దానివిలువ ఎనిమిది లక్షలు ఉంటుందని అంచనా.

చతుర్థ ప్రణాళికా కాలంలో తీరంవెంట మరిఏడు రాడార్‌లను నెలకొల్పనున్నట్లు శ్రీ ఎస్. ఎ. ఖాజామొహియుద్దీన్‌కు మంత్రి చెప్పారు.

ఈ ఏడు రాడార్లు ఒక్కొక్కటి రూ. 18 లక్షలు ఉంటుంది.

# తెలంగాణా సమస్యలో రాష్ట్రపతి జోక్యానికి విజ్ఞప్తి

## శ్రీ వి. వి. గి. కి తెలంగాణా కాంగ్రెస్ పార్టీ ప్రతినిధివర్గంచే వినతి పత్రం సమర్పణ

న్యూఢిల్లీ, ఆగస్టు 26

"తెలంగాణా కాంగ్రెస్ పార్టీ"కి చెందిన ఆరుగురు సభ్యులుగల ప్రతినిధివర్గం నేటి ఉదయం రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరిని కలుసుకొని, తెలంగాణా సమస్య విషయంలో జోక్యం చేసుకోవలసిందని కోరుతూ ఆయనకు వినతిపత్రం సమర్పించింది.

"తెలంగాణా సత్యాగ్రహులను అమానుషంగా హింసించడం, పోలీసులు వారిపై పాశవిక చర్యలు సాగించడం జరుగుతున్నద"ని ఆ వినతిపత్రంలో ఆరోపించబడింది. బ్రహ్మానందరెడ్డి ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేసి రాష్ట్రంలో రాష్ట్రపతిపాలన విధించాలని కూడా ప్రతినిధివర్గం కోరింది.

తెలంగాణా ప్రజాజీవితం, కార్యకలాపాలు స్తంభించిపోయాయని, రెండు వందలమంది మరణించారని, వెయ్యిమంది జైలులో వున్నారని ప్రతినిధివర్గం తెలియజేసింది.

ప్రస్తుత పరిస్థితిని కొనసాగనిస్తే పరిణామాలు తీవ్రంగా వుండగలవని పార్టీ ప్రధాన కార్యదర్శి శ్రీ జనార్దన్‌రెడ్డి హెచ్చరించారు. ప్రబల శాంతియుత, న్యాయసమ్మతమైన ఉద్యమాన్ని ఎందరు సాయుధ పోలీసులు, సైనికులను వినియోగించినా అణచివేయడం సాధ్యం కాదని ఆయన అన్నారు.

ఈ ప్రతినిధివర్గం యిదేవిధమైన వినతి పత్రాన్ని ప్రధానికి కూడా సమర్పించింది.

## రైల్వే సరకుల అపహరణ: నష్టపరిహారం

న్యూఢిల్లీ, ఆగస్టు 26: దొంగతనంగా సామాను దాచేయడం (పూర్తి ప్యాకేజీలు, సరుకులు కాక) ఖాతా కింద నష్ట పరిహారంగా 1965-66 లో రు. 1830278 లు ఇవ్వగా ఆ మొత్తం 1967-68 లో రు. 347,78,025లకు పెరిగిందని లోక్ సభలో ఒక ప్రశ్నకు సమాధానంగా రైల్వేక్ మంత్రి డాక్టర్ రామ్‌సుభగ్‌సింగ్ చెప్పారు. పూర్తి ప్యాకేజీలు, సరకులు దొంగిలించడం వల్ల నష్టపరిహారంగా చెల్లించిన మొత్తం 1965-66 లో రు. 804471 లు కాగా మరు సంవత్సరంలో రు. 684790 లకు తగ్గింది. 1967-68 లో రు. 747653 లుగా ఉంది. వ్యాగనులు బద్దలు కొట్టడం ద్వారాను దొంగతనంగాఅపహరించడం ద్వారాను ఎక్కువ రైల్వే సరకుపోతున్నది.

# దినఫలం

రాహు. కాలములు: ఆగస్టు 27: బుధవారం— మధ్యాహ్నం గం. 4.2 వరకు తిథి మంచిది కాదు. తరువాత మంచిది. నక్షత్రం మంచిది. ఆ తరువాత— తిథి మంచిది. ఉదయం గం. 7.37 వరకు నక్షత్రం మంచిది కాదు.

ప్రయాణాలకు: ఆగస్టు 27: బుధవారం మధ్యాహ్నం గం. 4.2 వరకు తిథి మంచిది కాదు. తరువాత మంచిది. ఉదయం గం. 9.34 వరకు నక్షత్రం మంచిది. (మిత్ర యోగం మంచిది తరువాత సామాన్యం, (మానసయోగం మంచిది. 28 గురువారం తిథి మంచిది. ఉదయం గం. 7.37 వరకు నక్షత్రం సామాన్యం (ధ్వజయోగం మంచిది కాదు. తరువాత మంచిది కాదు (ముద్గర యోగం మంచిది కాదు)
(వర్జ్యమును దుర్ముహూర్తమును గమనించవలెను)

జన్మదినఫలం: ఆగస్టు 27: గ్రహబలం అనుకూలంగా ఉంది. వృత్తి వ్యాపారాల్లో మీ ఆలోచనలు సరియైనవని రుజువు కావడం వల్ల అధికారాయంలో పాటు ఆత్మవిశ్వాసం లభిస్తుంది. ఇదివరకు మీ యెడల విరోధంగా ఉన్నవారు కూడా యిప్పుడు మీ అభిప్రాయాలను గౌరవిస్తారు. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి

## 27-8-1969 బుధవారం

శా. సం. 1891 భాద్రపదమాసం

**మేషం**

వృత్తిలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభించగలదు. భరణి నక్షత్ర జాతకులు మాత్రం జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం

**వృషభం**

అన్ని వ్యవహారాల్లోను గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. ప్రయాణం ద్వారా కార్య సాధన చేయగలరు. బంధువుల వ్యవహారాల్లో మీ కృషి ఫలిస్తుంది. కృత్తికా నక్షత్ర జాతకులకు మిగిలిన వారికంటే బాగా ఉంటుంది.

**మిథునం**

వృత్తి వ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. ఆర్ద్రా నక్షత్ర జాతకులకు మాత్రం బాగా ఉండదు

**కర్కాటకం**

అన్ని వ్యవహారాల్లోను ఆకస్మికంగా చికాకులు ఏర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం తగదు. ఆందోళన కలుగుతుంది. ఆశ్లేష నక్షత్ర జాతకులకు మిగిలినవారికంటే జాగ్రత్తగా వ్యవహరించడం చాలా అవసరం.

**సింహం**

వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. కుటుంబ సంతోషం లభిస్తుంది. ఆరోగ్యం బాగా ఉంటుంది.. మఖా నక్షత్ర జాతకులకు మిగిలిన వారికంటే బాగుంటుంది.

**కన్య**

ఇతరుల మీద ఆధారపడి యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది. అధిక వ్యయం జరుగుతుంది. హస్తా నక్షత్ర జాతకులు జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.

**తుల**

వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. స్వాతీ నక్షత్ర జాతకులకు మాత్రం బాగా ఉండదు.

**వృశ్చికం**

సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. జ్యేష్ఠ నక్షత్ర జాతకులు జాగ్రత్తగా వ్యవహరించడం చాలా అవసరం.

**ధనుస్సు**

వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు సరుకుగా సాగుతాయి. నూతన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. మిత్రులకు సహాయం చేస్తారు. మూలా నక్షత్ర జాతకులకు మిగిలినవారికంటే బాగా ఉంటుంది.

**మకరం**

వ్యాపారంలో ప్రయోజనం గల సంభాషణలు జరుపగలరు. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. ఉత్తరాషాఢా నక్షత్ర జాతకులకు మిగిలినవారికంటే బాగా ఉంటుంది..

**కుంభం**

ఇదివరకు మీ కార్యక్రమాల్లో ఏర్పడిన అవరోధాలు తొలగిపోతాయి. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. శతభిషా నక్షత్ర జాతకులు మాత్రం జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.

**మీనం**

కొన్ని వ్యవహారాల్లో మీ లాభాలకు మిత్రులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు.. అధిక వ్యయం జరుగుతుంది. దైన కార్యాలు నెరవేరతాయి. ఆరోగ్యం బాగా ఉండదు. రేవతీనక్షత్ర జాతకులు మిగిలినవారికంటే జాగ్రత్తగా వ్యవహరించడం చాలా అవసరం.

గురు వ్యవహారాలు ఆగస్టు 28 గురువారం—తిథి మంచిది. ఉదయం 7-37 వరకు నక్షత్రం మంచిది. తరువాతమంచిదికాదు. 29 శుక్రవారం—తిథిమంచిది. ఉదయం 5-57 వరకు నక్షత్రం మంచిదికాదు. తరువాత మంచిది ప్రయాణాలకు: ఆగస్టు 28 గురువారం—తిథి మంచిది ఉదయం 7-37 వరకు నక్షత్రం సామాన్యం. ధ్వజయోగం మంచిదికాదు తరువాత మంచిదికాదు (ముద్గరయోగం మంచిదికాదు) 29 శుక్రవారం—తిథి మంచిది. ఉదయం 5-57 వరకు నక్షత్రం మంచిదికాదు. ధ్వాంక్షయోగం మంచిదికాదు) తరువాత మంచిది (ధ్వజయోగం మంచిది వర్జ్యమును, దుర్ముహూర్తమును గమనించవలెను)

జన్మదినఫలం: ఆగస్టు 28: ఈ సంవత్సరం వృత్తి వ్యాపారాలలో క్రమాభివృద్ధిని సాధించగలరు. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. ఇదివరకు కొన్ని వ్యవహారాల చిక్కుల్లో ఉండిపోయిన డబ్బు ఇప్పుడు చేతికి రాగలదు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం తగదు. ఉద్యోగంలో ఇతరుల నిమిత్తం శ్రమపడ గలరు. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ సంతోషం లభిస్తుంది.

## (28-8-1969 గురువారం)

శా. సం. 1891 భాద్రపదమాసం

**మేషం**

మీరు చేయవలసిన ముఖ్యమైన పనులు ఈదినం పూర్తి చేయడంమంచిది సమయానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికిరాగలదు. నూతన విషయాలను తెల్సుకొంటారు. అశ్వినీ నక్షత్ర జాతకులు మాత్రం జాగ్రత్తగా వ్యవహరించడం చాలా అవసరం.

**వృషభం**

వృత్తిలో ప్రయోజనంగల సంభాషణలు జరుపగలరు. స్థిరాస్తి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. నూతనావకాశాలు వస్తాయి. కృత్తికా నక్షత్ర జాతకులు మాత్రం జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.

**మిథునం**

వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించగలదు. సంతోషకరమైన వార్తలను వింటారు. ఆరోగ్యం బాగా ఉంటుంది. పునర్వసూ నక్షత్ర జాతకులకు మాత్రం బాగుండదు.

**కర్కాటకం**

వ్యాపారంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. ప్రయాణాల్లో ప్రయాస అధికంగా ఉంటుంది. ఉద్యోగంలో ముఖ్యమైన నిర్ణయాలు వాయిదా వేయడం మంచిది. ఆశ్లేష నక్షత్ర జాతకులకు మాత్రం కొంచెం బాగా ఉంటుంది.

**సింహం**

వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండ నెరవేరతాయి. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. మఖా నక్షత్ర జాతకులు మాత్రం జాగ్రత్తగా వ్యవహరించడం చాలా అవసరం.

**కన్య**

రావలసిన డబ్బు సమయానికి అందకపోవడంవలన ఇబ్బంది కలుగుతుంది. వ్యాపారంలో పోటీవారితో పోటీ పెరుగుతుంది. సాంఘిక కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. హస్తా నక్షత్ర జాతకులు జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం

**తుల**

మీకు ముఖ్యమైన లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. శుభ కార్యాల విషయంలో అనుకూలతను సాధించగలరు. విశాఖా నక్షత్ర జాతకులకు మాత్రం బాగా ఉండదు.

**వృశ్చికం**

కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది పోటీవారిలో గౌరవం లభిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి. జ్యేష్ఠా నక్షత్ర జాతకులకు మిగిలిన వారికంటే బాగా ఉంటుంది.

**ధనుస్సు**

వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగ ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. మూలా నక్షత్ర జాతకులు మాత్రం జాగ్రత్తగా వ్యవహరించడం చాలా అవసరం.

**మకరం**

వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. నూతన వ్యవహారాలు అనుకూలంగాఉంటాయి. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. ప్రయాణాలలో పని చేస్తారు. శ్రవణనక్షత్ర జాతకులకు మిగిలిన వారికంటే బాగ ఉంటుంది.

**కుంభం**

ఆకస్మికంగా అన్ని వ్యవహారాల్లోను అనుకూలతను సాధించగలరు. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు. ధనిష్ఠా నక్షత్ర జాతకులు మాత్రం జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.

**మీనం**

అధిక వ్యయం జరగడంవలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. కుటుంబ వ్యవహారాల్లో చికాకులు ఏర్పడి.... ఉద్యోగంలో ఎవరినీ విశేషంగా నమ్మడం తగదు. రేవతీ నక్షత్ర జాతకులకు మాత్రం కొంచెం బాగాఉంటుంది.

— మహాప్







# ప్రెస్ ఆఫ్ ఇండియా పత్రికల స్వాధీనం వార్త అసత్యం

## లోక్‌సభలో మంత్రి రఘునాధరెడ్డి ప్రకటన

న్యూఢిల్లీ, ఆగస్టు 26: ప్రెస్ ఆఫ్ ఇండియా గ్రూపు పత్రికల యజమానులు శ్రీ శాంతిప్రసాద్‌జైన్ ప్రభృతులపైవచ్చిన అక్రమ నిర్వహణ, ధన దుర్వినియోగ కేసుల విషయంలో ఇక ముందు ఏలాంటి చర్యలు తీసుకోకుండా వుండే అంగీకారంపై ఆ గ్రూపు పత్రికలను స్వాధీనం చేసుకోదానికి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నట్లు వార్త నిజంకాదని కంపెనీ వ్యవహారాల శాఖ సహాయమంత్రి శ్రీ కె.వి. రఘునాధరెడ్డి నిన్న లోక్‌సభలో తెలియజేశారు.

శ్రీ ఎస్. ఎం. జోషి, శ్రీ మధులిమాయె, శ్రీ జార్జి ఫెర్నాండెజ్ (ఎస్. ఎస్. పి.) శ్రీ ప్రకాశ్‌వీర్‌శాస్త్రి (ఇం) ప్రభృతులు ప్రతిపాదించిన సావధాన తీర్మానానికి శ్రీ రెడ్డి జవాబిస్తూ ఈ కేసులలో చర్యలను పూర్తిగా యోగ్యతా యోగ్యతలనుబట్టే తీసుకొంటున్నామనడానికి, కంపెనీల చట్టంలోని 388—బి సెక్షన్ క్రింద దాఖలయిన పిటిషన్ విచారణ కొనసాగడం, క్రిమినల్ ప్రాసిక్యూషన్‌లు దాఖలు చేయడం నిదర్శనాలని అన్నారు.

కంపెనీల చట్టంలోని 398 సెక్షన్ క్రింద బొంబాయి హైకోర్టులో కేసు నడుస్తోందని ఆయన చెప్పారు.

ప్రెస్ ఆఫ్ ఇండియా పత్రికల డైరెక్టర్ల బోర్డు పునర్వ్యవస్థీకరణకు అబోర్డు కాలపరిమితికి, దర్యాప్తులో సాయపడిన ఉద్యోగుల రక్షణకు సంబంధించిన వ్యవహారాలను ఇటీవల మంత్రివర్గం పరిశీలించినదని ఆయన తెలిపారు.

కొత్త డైరెక్టర్ల బోర్డులో సహేతుకమైన కాలంపాటు వాటాదారులు కాని వారు అధిక సంఖ్యలో సభ్యులుగా వుండడం కంపెనీ ప్రయోజనాల దృష్ట్యా మంచిదని ప్రభుత్వం భావించినదన్నారు.

కొత్త డైరెక్టర్ల బోర్డుకు శ్రీ శాంతిప్రసాద్ జైన్ కుమారుడు అయిన శ్రీ అశోక్ జైన్‌ను అధ్యక్షునిగా చేయగలమని, ప్రభుత్వం తరఫున బోర్డులో నలుగురు డైరెక్టర్లు వుండగలరని పారిశ్రామికాభివృద్ధి శాఖా మంత్రి శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ శ్రీ జైన్‌కు ఫోను ద్వారా హామీ ఇచ్చినట్లు వార్తను ధ్రువపరచాలని ప్రతిపక్ష సభ్యులు పట్టుబట్టారు. శ్రీ రెడ్డి ఇంకేదో సమాధానం ఇవ్వగా విస్పష్టంగా చెప్పాలని సభాపతి శ్రీ ధిల్లాన్ సూచించారు.

అయితే ఈ టెలిఫోన్ హామీ సంగతి తనకు తెలియదని శ్రీ రెడ్డి అన్నారు.

బోర్డులో డైరెక్టర్లుగా ప్రభుత్వం తరఫున వర్కింగ్ జర్నలిస్టులను నియమించాలని శ్రీ మధులిమాయే సూచించగా అద్భుతమైన సూచన అని మంత్రి హర్షం ప్రకటించారు.

అక్రమ నిర్వహణ జరిపిన వారినిబోర్డులో నియమించే ప్రశ్న లేదన్నారు.

## బోర్డు అధ్యక్షునిగా కాంతిలాల్ దేశాయ్

బొంబాయి, ఆగస్టు 26: ప్రెస్ ఆఫ్ ఇండియా గ్రూపు పత్రికల ప్రచురణకర్త అయిన బెనెట్‌కోల్‌మన్ కంపెనీ అధ్యక్షునిగాను డైరెక్టర్‌గాను గుజరాత్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి, స్టేట్ బ్యాంకి ఉపాధ్యక్షుడు శ్రీ కాంతిలాల్ దేశాయ్‌ని బొంబాయి హైకోర్టు వారు నిన్న నియమించారు. శ్రీ దేశాయ్‌కి పూర్తి అధికారంలో సమ్ సర్వాధికారాలను కోర్టువారు దాఖలు పరిచారు.

బెనెట్‌కోల్‌మన్ కంపెనీ, ఎస్. పి. జైన్ ప్రభృతులపై భారత ప్రభుత్వం దాఖలు చేసిన దరఖాస్తును విచారించి న్యాయమూర్తి శ్రీ జైన్ ఈ చర్య తీసుకొన్నారు.

కంపెనీ ఇదివరకటి అధ్యక్షుడయిన శ్రీ డి. కె. కుంతే రాజీనామాను సమర్పించారు. ఆ రాజీనామాను న్యాయమూర్తి ఆమోదించారు. బొంబాయి షరీఫ్ శ్రీ ఎస్. ఎం. టహానుకర్‌ను కూడా డైరెక్టర్‌గా నియమించారు.

## కాంగ్రెస్ నైతిక పతనం

### డా॥ మహావీర్ ఉద్ఘాటన

విజయవాడ, ఆగస్టు 26: కాంగ్రెసు సంస్థను కాంగ్రెసు ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరా గాంధియే వెన్నుపోటు పొడిచిందని, కాంగ్రెసుకు గౌరవం, నైతిక విలువపూర్తిగా పోయిందని జనసంఘ పార్లమెంటు సభ్యులు డాక్టర్ భయ్ మహావీర్ ఏలూరులో ఒక బహిరంగసభలో ప్రకటించారు.

రాష్ట్రపతి ఎన్నికల సందర్భంలో కాంగ్రెస్ పార్టీలో చెలరేగిన కల్లోలాన్ని ఆయన ప్రస్తావించారు.

అనుకున్నదానికన్నా ముందుగానే కాంగ్రెసు చచ్చిపోతోందని కాంగ్రెస్‌కు ప్రత్యామ్నాయంగా జాతీయ దృక్పథం, భారతీయ సంస్కృతిలో పునాదులున్న జనసంఘం మాత్రమే ఆ ఖాళీని భర్తీ చేయగలదని ఆయన ఉద్ఘాటించారు.

పెద్ద బ్యాంకులను జాతీయం చేయటాన్ని తీవ్రంగా విమర్శించి ప్రధాని తన రాజకీయ ఆశయాన్ని పెంచుకొని సిండికేటును బలహీనపరచి అపఖ్యాతి పాలు చేయటానికే ఆ చర్య తీసుకున్నదని ఆయన స్పష్టంచేశారు.

పశ్చిమ గోదావరి జిల్లా జనసంఘ అధ్యక్షులు శ్రీ [illegible]

# ఆకాశవాణి

తెలుగులో వార్తలు: ఉ. 7.00 మ. 1.50, సా. 7.00. ఇంగ్లీషులో వార్తలు: ఉ. 6.40, 8.15 మ. 1.30, సా. 6, రా. 9.00 10.30

గురువారం, ఆగస్టు 28

### హైదరాబాద్–ఎ

(405.4 మీ)

ఉ. 6.30 వందేమాతరం 6.35 భక్తిరంజని 7.15 సంగీత శిక్షణ 7.30 సంస్కృత పాఠము 7.45 వాద్యసంగీతం 8.30 విజయ వాదవళి

మ. 11.45 ప్రాథమిక పాఠశాలలకు 12.30 కార్మికుల కార్యక్రమము 1.00 టి. ఎల్. ప్రసూనాంబ 1.40 చిత్రసీమ

సా. 5.55 ప్రసార విశేషాలు 6.05 ప్రాంతీయ వార్తలు 6.30 గ్రామలక్ష్మి 7.15 పురాణ కాలక్షేపం 7.30 లలితసంగీతం 8.00 మీరు కోరిన పాటలు 8.30 పరిచయపత్రం 8.45 జానపదగేయాలు 9.30 అ. భ. నాటక కార్యక్రమము 10.35 జనగణమన.

### హైదరాబాద్–బి

కడప (333.3 మీ)
విశాఖపట్నం (322.6 మీ)
సా. 5.55 నుండి రా. 10.35 వరకు

(217.4 మీ)

ఉ. 6.30 వందేమాతరం 6.45 సుగం సంగీత్ 7.00 అంతోనీ మాత్యూస్:వయొలిన్

మ. 2.00 శాస్త్రీయసంగీత్ 2.20 శాస్త్రీయ సంగీత్ 2.50 సుగం సంగీత్

సా. 8.00 సుబద్ధ సంగీత్ 8.25 వాద్య సంగీత్ 9.00 చిత్రపట్ సే 10.00 అంతోనీ మాత్యూస్:వయొలిన్ 10.30 జనగణమన.

### విజయవాడ

(357.1 మీ)

ఉ. 6.00 వందేమాతరం 6.10 భక్తిరంజని 6.45 సూక్తిముక్తావళి 7.15 సంగీతశిక్షణ 7.45 బహార్‌వాణి 8.30 ఎ. జయలక్ష్మి: వీణ.

మ. 11.45 ప్రాథమిక పాఠశాలలకు 12.30 కార్మికుల కార్యక్రమము 1.00 జి. ఎస్. బాలసుబ్రహ్మణ్యం 1.40 పసిడి పంటలు

సా. 5.30 ఎ. జయలక్ష్మి: వీణ 5.55 స్థానిక ప్రకటనలు 6.05 ప్రాంతీయ వార్తలు 6.15 [illegible] 6.30 [illegible] 7.15 పంటసీమలు 7.45 లలితసంగీతం 8.00 ఉభయకుశలోపరి 8.25 గానసుధ 9.15 అ. భ. నాటక కార్యక్రమము 10.35 జనగణమన

### మద్రాసు–ఎ

(416.7 మీ)

ఉ. 6.00 వందేమాతరం 7.00 వాద్య సంగీతం 8.45 గీతమంజరి 9.15 ఎన్సెంబిల 10.00 జి. ఎస్. దేశికన్ 10.30 పిమాలె

మ. 11.45 ప్రాంతీయ వార్తలు 12.00 జానపదగేయాలు 12.15 వాద్య సంగీతం 1.00 జి. ఎస్. దేశికన్ 1.30 చిత్రగానం 1.40 వాద్యగోష్ఠి

సా. 5.30 కార్మికుల కార్యక్రమము 6.45 చిత్రగానం 8.00 గ్రామం 9.15 వాద్యసంగీత్ 9.25 ఈ మాసపు పాట 9.30 అ. భా. నాటక కార్యక్రమము 11.00 జనగణమన.









